# AANANDHA SAPTHAKAMU

# ఆనంద సప్తకము

:: మొదటి భాగం ::

గత నాలుగు సంవత్సరాలుగా ఘోరఖ్‌పూర్‌లోని ఒక సంస్థలో పని చేస్తున్న ఆనంద్ ప్రతి సంవత్సరంలాగానే ఈ సంవత్సరం కూడా (2005) ఒక వారం రోజులు సెలవుపై మన ఇంటికివచ్చాడు. ఇంటికి వచ్చిన మొదటి రోజు చాలా హ్యాపీగానే వున్నాడు. తరువాతి రోజు మమ్మీతో **'నాకు కొంచెం తలనొప్పిగా వుంది'** అన్నాడంట.....! ఆ విషయం మమ్మీ నాకు చెప్పింది. దానికి సమాధానంగా ఆనంద్‌ని హాస్పిటల్‌కి తీసుకొని వెళ్లాలంటే నాకు చెప్పు నేను తీసుకొనివెళ్తానన్నాను.

మమ్మీ ఆనంద్‌తో మాట్లాడుతూ.....నీకు తలనొప్పిగా వుందన్నావు కదా.......... హాస్పిటల్‌కి వెళ్తావా...అని అడిగితే, నేను ఘోరఖ్‌పూర్‌లోని హాస్పిటల్‌లో చూపించుకొన్నాను. తలనొప్పికి వారు మందులు ఇచ్చారు, వాటినే ఇప్పటి వరకూ వాడు కొంటున్నాను....... ఇంటికి వచ్చేటప్పుడు నాతోపాటుగా ఆమందులను తెచ్చుకొన్నాను. వాటినే వాడుకొంటాను హాస్పిటల్‌కి వెళ్లాల్సిన అవసరం లేదన్నాడని మమ్మీ నాతో అన్నది.

ఆనంద్ మిగిలిన సెలవ దినాలను కూడా తలనొప్పితోనే గడిపేశాడు. మేము రెండు, మూడుసార్లు ఆనంద్‌ని హాస్పిటల్‌కి రమ్మని పిలిచాము. ఆనంద్ ఎందుకనో మా మాటలను పట్టించుకోలేదు. మేము కూడా బలవంతం చేయకుండా సైలెంటుగానే వుండిపోయాము.

జూన్ 17 (శుక్రవారం), 2005 ఆరాత్రంతా సరిగా నిద్రపట్టలేదు, ఎందుకంటే జూన్ 14 (మంగళవారం), 2005 నుండి ఆనంద్ ఆరోగ్యం బాగాలేదు (తీవ్రమైన తలనొప్పి) అందువల్ల నన్ను కూడా ఆనంద్‌తో పాటూ..., తోడుగా ఘోరఖ్‌పూర్‌కి వెళ్లమన్నారు. నేను ఇంతకముందు ఎప్పుడూ ఘోరఖ్‌పూర్ చూడలేదు, ఇప్పుడైనా ఆనంద్‌తో పాటూ వెళ్లి ఘోరఖ్‌పూర్‌ని చూడవచ్చని ఆనంద్‌తో ఊరికి వెల్లటానికి నేను అంగీకరించాను.

ఆరోజు రాత్రి గం॥ 12.00 ని॥ లకు అలారం శబ్దంతో మేడపై నిద్రపోతున్న నేను నిద్రలేచాను. నిదానంగా కిందకు దిగి కింది ఇంటి తలుపు తట్టాను. మా అమ్మ లేచి తలుపు



AANANDHA SAPTHAKAMU

తీసి 'ఇంకా టైం వుందిగా కొద్దిగ సేపుపండుకొని రాకూడదా....! అన్నది. ఇప్పటి నుండి రెడీ ఐతే టైం కరెక్టుగా సరిపోతుంది అని నేనన్నాను.

కాలకృత్యాలు తీర్చుకొన్న తరువాత ఆటో కోసం అలంకార్ సెంటర్‌కి వెళ్ళాను. అదే సమయానికి ఒక ఆటో వచ్చింది కానీ డబ్బులు ఎక్కువ అడిగినందువల్ల (రూ. 30/–) ఆర్.టి.సి. సెంటర్‌కి వెళ్ళాను. అక్కడ కూడా బాడుగ రూ. 30/– అడిగారు ఇంకా టైం వేస్టు చేయటం ఎందుకని ఆ ఆటోనే మాట్లాడుకొని తీసుకొచ్చాను.

అది జూన్ 18 (శనివారం), 2005 ఉదయం గం॥ 1 లేదా 1.30 ని॥ ఆనంద్ అప్పటికే రెడీ ఐవున్నాడు. నేను ఇంట్లోకి వెళ్ళి బ్యాగ్స్ తీసుకొని బైల్దేరేముందు మమ్మీ ఆనంద్‌కి ఐ.డి. కార్డ్, డబ్బులు తీసి ఇస్తుంటే **'నాకు ఇవ్వవద్దు అన్నయ్యకే ఇవ్వు అన్నాడు'**. అదే సమయానికి డాడీ గారు **'ఫుల్‌గా మందు కొట్టి'** నిద్రపోతున్నాడు. తరువాత ఆనంద్, నేనూ ఊరికి బయలు దేరాము. అదే సమయానికి అనుకోకుండా (యూరిన్ పాస్ చేయటా–నికి) సులోచనా పెద్దమ్మ మాకు ఎదురొచ్చింది. మన ఇంటి ముందున్న కరెంటు స్థంభం ముందు ఆగి వున్న ఆటోలో మేమిద్దరం కూర్చునే ముందు మమ్మీ మాకు ఎదురు వచ్చి, **'ఉంటాను ఆనంద్ బాబు ......!'** అని చెప్పి ఇంటికి వెళ్ళిపోయింది.

---

## :: రెండవ భాగం ::

---

మేమిద్దరం ఆటోలో కొండదిబ్బ, పొట్టి శ్రీరాములు బొమ్మ, గచ్చు కాలువ, నాగరాజం ప్రొవిజన్స్, కలెక్టర్ ఆఫీస్ మీదుగా గాంధీ బొమ్మ దగ్గరకు రాగానే ఆటోవాడు లస్సీ సెంటర్ మీదుగా వెళ్లాలా, కనకమహాల్ మీదుగా వెళ్లాలా....! అని అడిగాడు. నేను కనకమహాల్ మీదుగా వెళ్లమని చెప్పాను. ఆటో రైల్వే స్టేషన్ ముందు ఆపింది. ఆటో అతనికి ఆనంద్ రూ॥30/– ఇచ్చాడు. మేమిద్దరం రైల్వే స్టేషన్‌లోకి రాగానే, నాకు టికెట్ లేదు తీసుకోవాలని చెప్పాను. ఆనంద్ నీకు టికెట్ లేదా....! అని ఆశ్చర్యంగా అన్నాడు. తరువాత ఆనంద్ బ్యాగ్ నా చేతికిచ్చి నా దగ్గర ఉన్న డబ్బులు తీసుకొనివెళ్లి తనే 'ఘోరఖ్‌పూర్' కి ఒక జనరల్ టికెట్ తీసుకొన్నాడు.

రైల్వే స్టేషన్ లోని 2వ ఫ్లాట్‌ఫాంలో ఖాళీగా వున్న ఒక బల్లపై మేమిద్దరం కూర్చు–న్నాము. ఎందుకనో ట్రైన్ వచ్చే ముందు వరకూ మేమిద్దరం **'సైలంటు'** గానే వుండి–పోయాము. కొంత టైం అయిన తరువాత మేము ఎక్కవలసిన బరోనీ ఎక్స్‌ప్రెస్ లేటుగా వస్తుందని అనౌన్స్ చేసారు. అనౌన్స్‌మెంట్ చేసిన కొంత సమయానికి బొకారో ఎక్స్‌ప్రెస్

AANANDHA SAPTHAKAMU

వచ్చి ఆగి....వెళ్లిపోయింది. మరికొంత సమయం వేచివున్న తరువాత మేము ఎక్కవలసిన బరోని ఎక్స్‌ప్రెస్ వస్తుందని అనౌన్స్ చేసారు. ఆ టైంలో ఆనంద్ కళ్లుమూసుకొని వున్నాడు. నేను ఆనంద్‌తో మనము ఎక్కవలసిన ట్రైన్ వస్తుందని అనౌన్స్ చేసారని చెప్తే అనౌన్స్ చేసిన ట్రైన్ నెంబర్ ఎంత అని నన్ను అడిగాడు. 522........ అని సమాధానం చెప్పాను. ఇదే మనము ఎక్కవలసిన ట్రైన్ అని లేచి నిలబడ్డాడు. ఇద్దరం ఒక సైడుగా వెళ్లి నిలబడ్డాము.

బరోని ఎక్స్‌ప్రెస్ వచ్చి ఆగింది. ఆనంద్ దగ్గర రిజర్వేషన్ టికెట్ ఉంది. కోచ్ నెంబర్/ సీటు నెంబరు ఎంత అని అడిగాను. నెంబరు సరిగా చెప్పలేకపోయాడు. అంత-లోగా ఎడమ వైపు రిజర్వ్ కోచ్ నుండి టి.సి. దిగి మమ్మల్ని పిలిచాడు. మేము దగ్గరకు పోయింతరువాత ఆనంద్‌ని...మీరు వెంకటేశ్వర్లా అని అడిగాడు, కాదు ఆనంద్ అని సమాధానం చెప్పాడు. టి.సి. ఆనంద్‌ని టికెట్ చూపించమన్నాడు. ఆనంద్ చూపించిన తరువాత ఈ ట్రైన్ ఇంతక ముందే వెళ్లి పోయిందే అన్నాడు. ఇంతలోనే మా వెనుక నుండి ఎవరో ఇద్దరు పరుగెత్తుకుంటూ వస్తున్నారు. టి.సి. వాళ్లను చూస్తూ తొందరగా రమ్మంటూ సైగ చేసాడు. వారు పరుగెత్తుకుంటూ ట్రైన్ ఎక్కేసారు. తరువాత మన ట్రైన్ వెళ్లిపోయిం-దంట నిజమేనా....! అని డౌట్‌గా ఆనంద్‌ని అడిగాను. ఇదే మనము ఎక్కాల్సిన ట్రైన్ అని కన్ఫామ్ గా చెప్పాడు ఆనంద్.

ట్రైన్‌లో ఎక్కడానికి ఆనంద్ మాత్రం ఇంకా అటూ... ఇటూ తిరుగుతూనే ఉన్నాడు. తన ముందున్న బోగీ డోర్ తీయటానికి ప్రయత్నిస్తూ, అందులో నిద్ర పోతున్న హిందీ అతనిని లేపి అతనితో ఏదో హిందీలో మాట్లాడాడు. అతను **'మాలూం నహీం'** అన్నాడు. అంతలో ట్రైన్ కదలటం మొదలైంది. మేమిద్దరం అదే బోగీలో చివరకు ఎక్కేసాము.

---

## :: మూడవ భాగం ::

---

నాది జనరల్ టికెట్, ఆనంద్‌ది రిజర్వేషన్ టికెట్ మేము ఎక్కింది మాత్రము రిజర్వేషన్ బోగీలో, ప్రస్తుతానికి ఏదో ఒక సీట్‌లో కూర్చుందామని ఆనంద్ అనుకొని వుంటాడు. అక్కడ నుంచి సీటు చూసుకొంటూ దక్షిణం సైడు వెళ్తే ఎడమ వైపు డబుల్ సిట్టింగ్ సీట్లు ఎదురెదురుగా రెండు కనపడ్డాయి. బోగీ యొక్క లెఫ్ట్ డోర్ (దక్షిణం డోర్) నుండి లెఫ్ట్ సైడ్ మూడో లైన్, సీట్ నెంబర్లు 16 మరియు 17, సీట్‌లో కూర్చునే టైంకు (తాత్కాలికంగా) పెన్నానది దాటుతున్నాము.

AANANDHA SAPTHAKAMU

ఆనంద్ నేనూ ఎదురెదురుగా కూర్చున్నాము. అప్పుడు ఆనంద్‌ని **'ఇదేనా మన రిజర్వేషన్ సీటు'** అని అడిగాను, దానికి ఆనంద్ ఈ బోగీకి ముందున్న బోగీలో మన సీటు-వుంది. నేను వెళ్లి చూసొస్తాను అని చెప్పి ఉత్తరం వైపు (కుడి వైపు) వెళ్లాడు. కొన్ని సెకండ్లకే తిరిగి వచ్చేసాడు. దీనికి గల కారణం అటూ.....ఇటూ వెళ్లటానికి ఇబ్బంది కరంగా అక్కడ చాలా మంది కింద పడుకొని నిద్ర పోతుండటమే. నేను ఆనంద్‌ని ఏమి వచ్చేసావు...! అని అడిగితే టి.సి. వచ్చి మనకు సీటు చూపిస్తాడులే మనమెందుకు ఇబ్బంది పడటం అని చెప్పి నా ఎదురుగా కూర్చున్నాడు.

సరేనని నేను **'మేము తెచ్చిన రెండు బ్యాగ్స్‌ని సర్దిపెట్టుకొన్నాను'**. ఆనంద్ వచ్చినప్పటి నుండి ఎందుకో చాలా **డల్‌గా** ఉన్నాడు. ఆనంద్‌కి ఆరోగ్యం బాగాలేదు కదా!....... అని నేను కూడా పట్టించుకోలేదు. ఆనంద్ ఉత్తరం సైడు పద్మాసనంలో కళ్లుమూసుకొని కూర్చుని వున్నాడు. కొన్ని నిముషాల తరువాత నేను ఆనంద్‌తో **'నీకు ఆరోగ్యం బాగాలేదు కదా....! పండుకో'** అన్నాను. నేను ఆమాట అనగానే **ఠక్కున** పండుకొన్నాడు. నన్ను కూడా ఉత్తరం వైపు కాళ్లు (దక్షిణం వైపు తల) చాపుకొని పండుకోమన్నాడు. ఇద్దరం చెరో సైడూ కొన్ని నిముషాల వరకు సైలంట్‌గా పండుకొన్నాము.

కొద్ది సేపటికి ఆనంద్ **'ఠక్'** మని లేచి నిలబడ్డాడు. తన రిజర్వేషన్ టికెట్ నాచేతికి ఇచ్చాడు. సైలెంటుగా ముందుకు వెళ్లి ఎడమచేతి వైపు ఉన్న డోర్ తీసుకొని అక్కడే నిలబడ్డాడు. ఆనంద్ ఇచ్చిన టికెట్‌ని జేబులో పెట్టుకొని, నేను కూడా ఆనంద్ వెనకే వెళ్లి ఆనంద్‌తో పాటూ అక్కడే నిలబడ్డాను. ఆనంద్ ఎందుకనో ట్రైన్ బైట తలవుంచి అటూ ఇటూ చూస్తూ వున్నాడు. ట్రైన్ ఏదైనా స్టేషన్‌లో ఆగితే తన సీట్ లోనికి వెళ్లటానికి ఏమైనా చూస్తు-న్నాడేమో అని, నేను కూడా తమాషాగా తనతో పాటుగా అక్కడేవున్నాను. అప్పుడు ఆనంద్ కళ్లను చూసాను **'ఆనంద్ కళ్లు నిప్పులాగా ఎఱ్ఱగా వున్నాయి'**. దేని గురించో తీక్షణంగా ఆలోచిస్తున్నట్లుగా అనిపించింది. ఏదో చెప్పలేని బాధ తన మనస్సులో ఉన్నట్టుగా అనిపిం-చింది. ఆనంద్ కళ్లల్లో నీళ్లు తిరగటం గమనించాను. కానీ నాకు అప్పుడేమీ అర్థం కాలేదు. సాదారణంగా డోర్ దగ్గర నిలబడితే ఆగాలికి, ధూలికి ఎవరికన్నా కళ్లు ఎరుపెక్కుతాయి అనుకొని పెద్దగా నేను పట్టించుకోలేదు.

ఆనంద్‌తో ఏదో ఒకటి పిచ్చాపాటిగా (టైం పాస్) మాట్లాడాలని అనుకొనే సమయానికి ట్రైన్ స్లో అయ్యింది. బహుషా అది కొండబిట్రగుంట అనుకొంటాను, అక్కడ గ్రానైట్ లోడింగ్ మరియు అన్ లోడింగ్ జరుగుతుంది. ఇక్కడ ట్రైన్ స్లో అయ్యిందే అని పలకరించాను. నేను పలకరించాలని ప్రయత్నించినా ఆనంద్ మాత్రం నాతో ఏమీ

AANANDHA SAPTHA KAMU

మాట్లాడలేదు. నేను తిరిగి వెళ్లి నాసీట్లో కూర్చున్నాను. మరలా కొంత సేపటికి ఆనంద్ దగ్గర కు వెళ్లి ఆనంద్‌తో పాటూ డోర్ దగ్గర నిలబడ్డాను. ఆనంద్‌ని పలకరించాలని **'ఇక్కడ నుంచి ఒంగోలుకి వెళ్లటానికి ఇంకా ఎంత టైం పడ్తుంది'** అని అడిగాను. ఆనంద్ ఠక్కున **'2 గంటలు పడ్తుంది'** అన్నాడు. కొద్ది సేపు అక్కడే వుండి తిరిగి వచ్చి నా సీట్లో కూర్చున్నాను.

కొద్దిగ సేపు నేను నాసీట్లోనే కూర్చొని తిరిగి మళ్లీ ఆనంద్ వద్దకు వెళ్లాను. కొంత సేపు ఆ డోర్ దగ్గర ఆనంద్ పక్కనే ఉన్నాను. అప్పుడు ఆనంద్ మాట్లాడుతూ……………. **"నువ్వు వెళ్లి అన్నీ సర్దుకొని పండుకో, నేను మళ్లీ వస్తాను"** అనగానే నేను కొంత నిరుత్సా-హంగా **"ఈ టైమ్‌లో ఏమి నిద్ర పడ్తుంది"** అని ఆనంద్‌తో అంటూ అయిష్టంగానే మరలా వెళ్లి నాసీట్లో కూర్చున్నాను (దీనికి గల కారణం అప్పుడు సుమారు 4 గంటలు అయివుండ-వచ్చు, ఆ టైమ్‌లో ఇంటి దగ్గర నేను నిద్ర లేచి వుంటాను) నేను ఈసారి కొద్దిగ ఎక్కువ సేపు నా సీట్లోనే వుండిపోయాను. తను నన్ను ఎందుకు వెళ్లమన్నాడో నాకు అస్సలు అర్థం కాలేదు. ఏదో పర్సనల్‌గా ఆలోచిస్తుంటాడు, ఆనంద్‌ని ఇబ్బంది పెట్టడం దేనికి తనే నిదానంగా వస్తాడనే నమ్మకంతో ఆ విషయాన్ని సాధారణంగా తీసుకొన్నాను.

ఊరుకూరికే ఆనంద్ దగ్గరకు వెళ్తే సీరియస్ అవుతాడేమో………..! అనుకొంటూనే మరలా అక్కడకు వెళ్లాను కానీ ఆనంద్ వున్న డోర్ దగ్గరకు (తూర్పు వైపు వున్న డోర్) కాకుండా ఆ డోర్‌కి ఎదురుగావున్న డోర్ (పడమర వైపు వున్న డోర్) దగ్గరకు వెళ్లి ఆ డోర్ ఓపన్ చేసి అక్కడే కొద్దిగ సేపు నిలబడ్డాను. ఆసమయంలో ఆనంద్‌ని గమనించాను!……… ఆ టైమ్‌లో ఆనంద్ రెండు చేతులు పైకి ఎత్తి డోర్‌కి ముందున్న రెండు పైప్‌లను (ట్రైన్ ఎక్కే టప్పుడు పట్టుకొనేవి) గట్టిగా పట్టుకొని దేని గురించో తీవ్రంగా ఆలోచిస్తున్నట్లుగా నాకు అనిపించింది. ఆనంద్‌ని ఇంకోసారి పలకరిద్దామనుకొన్నాను, నేను పలకరిస్తే సీరియస్ అవుతాడేమో అనిపించింది. తనే వస్తాడనే నమ్మకంతో తిరిగి వెళ్లి నాసీట్లో కూర్చున్నాను.

నేను నాసీట్లో కూర్చున్న తరువాత కొంత సేపు నిద్ర పోయాను. కొంత సేపటి తరువాత నేను నిద్ర లేచి చూస్తే ఆనంద్ ఇంకా రాలేదు. ఇంకా ఏంచేస్తున్నాడబ్బా అనుకొంటూ ఆనంద్ వున్న గేటు దగ్గరకు వెళ్లి చూస్తే ఆనంద్ కనపడలేదు…!!!?……….. నేను ఒక్కసారిగా షాక్‌కు గురైయ్యాను. ఆనంద్ నిలబడి వున్న డోర్ పక్కన ఒక సీటు ఖాళీగా వుండేది అందులో ఏమైనా ఆనంద్ కూర్చొని వుంటాడేమోనని చూస్తే అక్కడ ఎవరో ఒక వ్యక్తి పండుకొని వున్నాడు. ఆనంద్ ఆ గేటు దగ్గర నిలబడి లేడు అలాగే ఆపక్క సీట్లో కూర్చొనీ లేడు………ఇంక ఎక్కడికి పోయివుంటాడబ్బా అనుకొంటూ వుండగా నా మెదడు



AANANDHASAPTHAKAMU

మొద్దుబారి పోయింది. ఆనంద్‌ని నేను నమ్మాను... ఆనంద్ మీద నాకు నమ్మకం వుంది. కానీ ఆ టైమ్‌లో అక్కడ ఏమి జరిగివుంటుందోనని ఆలోచిస్తుంటే నామెదడులో కొన్ని వేల ఆలోచనలు పుట్టాయి. గుండె దడ పెరిగింది. భయం ఆవరించింది.

నేను నిద్రపోయే సమయంలో ట్రైన్ ఏమైనా స్లో అయ్యి ఆనంద్ దిగేసాడా....!! మేమున్న బోగీ నుండి తరువాతి బోగీలోకి వెళ్లివుంటాడా! అనే ఆలోచనలు వచ్చాయి. కానీ నాకు చెప్పకుండా ఆనంద్ ఇలాంటి పనులు ఎట్టి పరిస్థితిలో చేయడు, ఎందుకైనా ఒక సారి చూస్తే పోతుందనుకొని వెతకడం ప్రారంభించాను. కొన్ని బోగీలు వెతికాను ఆనంద్ కనపడలేదు. ఠక్కుమని **టాయ్‌లెట్** గుర్తుకొచ్చింది అక్కడకు వెళ్లి చూడగా టాయ్‌లెట్‌లో లైటు వేసి గెడియ పెట్టి వుంది. ఆనంద్ టాయ్‌లెట్‌లో వుండి వుండవచ్చనుకొని కొంత సేపు అక్కడే వెయిట్ చేసాను. అదే సమయానికి కిటికీలోంచి **'శింగరాయకొండ'** రైల్వే బోర్డ్ కనపడింది. అంటే ఆ సమయానికి శింగరాయకొండ దాటుతున్నామని అర్థమైంది.

టాయ్‌లెట్‌లో వున్న వారు చాలా సేపు వరకూ బైటకు రాలేదు, అందులో ఎవరు–న్నారో అనుకొంటూ ఒక వేళ ఆనంద్ వుంటే నాదగ్గరకే వస్తాడనుకొని తిరిగి నా సీట్లోకి వచ్చేసాను. మరలా కొంత సేపు నిద్రపోయాను. ట్రైన్ ఒంగోలు స్టేషన్‌లో ఆగి.... తిరిగి బైల్దేరింది. ఆనంద్ మాత్రం నాదగ్గరకు రాలేదు. ట్రైన్ ఒక్కొక్క స్టేషన్‌లో ఆగుతుంది........ తిరిగి బైల్దేరుతుంది. ఆనంద్ మీద నాకు చాలా కోపం వచ్చింది. ఆనంద్ ఎందుకిలా చేసాడు అనుకొంటూవుండగా నాకు షడన్‌గా మూడు అలోచనలు వచ్చాయి.

1. **నేను నిద్ర పోయే టైమ్‌లో ఆనంద్ ఎక్కడైనా దిగేసి వుంటాడా?**
2. **నాకు చెప్పకుండా వెళ్లి ఏదో ఒక బోగీలో నిద్ర పోతూ వుంటాడా?**
3. **సూసైడ్ చేసుకోటానికి ప్రయత్నించి వుంటాడా?**

ఆనంద్ పై విధంగా చేయటానికి బలమైన కారణాలు ఏమీలేవు. ఉదాహరణకు–ఇంట్లో ఏవిధమైనా గొడవలు జరగలేదు, ఏవిధమైనా ఆర్థిక సమస్యలు లేవు, ఏవిధమైనా మానసిక సమస్యలు లేవు, ఏవిధమైనా వ్యక్తిగత సమస్యలు లేవు, మాకు తెలిసినంతలో ఆనంద్‌కి ఇంట్లోకానీ, బైట కానీ, పని చేసే దగ్గర కానీ ఏవిధమైనా సమస్యలు లేవు.

నాకు వచ్చిన ఈ మూడు ఆలోచనలలో మూడోది కరెక్టు కాదోమో అనుకొన్నాను. ఎందుకంటే ఆనంద్ సూసైడ్ చేసుకొనేంత పిరికివాడు కాదు. చాలా తెలివిగలవాడు ఎంత పెద్ద సమస్య వచ్చినా చిటికెలో పరిష్కరించేవాడు. నాకు ఒక విషయం గుర్తుకొచ్చింది.

AANANDHA SAPTHAKAMU

అదేంటంటే 2000 సంవత్సరంలో మా బాల్య స్నేహితుడు (సుధాకర్ అలియాస్ చిన్ని) సూసైడ్ చేసుకొన్నాడు అతన్ని చాలా తీవ్రంగా విమర్శించాడు. ఆనంద్ ఎప్పుడూ సూసైడ్స్‌ని వ్యతిరేకిస్తుండేవాడు. అలాంటి వాడు సూసైడ్ చేసుకొనివుంటాడా..... అని డౌట్ వచ్చినా అలాంటివేమీ జరిగివుండదనే ధైర్యంతో అలాగే ఉండిపోయాను. ఆ సమయానికి ట్రైన్ విజయవాడకు దగ్గర్లోవున్నది.

జూన్ 18, 2005 (శనివారం) ఉదయం గం॥ 5-45 నుండి 6-25 ని॥ మధ్య ట్రైన్ విజయవాడలో ఆగింది. ట్రైన్ విజయవాడలో ఆగగానే నాకు కొంత ధైర్యం వచ్చింది, ఎందుకంటే ఆ స్టేషన్‌లో ట్రైన్ ఎక్కువ సేపు నిలబడుతుంది. కాబట్టి ఆనంద్‌ని వెతకటానికి చాలా వీలు కలుగుతుందనుకొన్నాను. ఆనంద్ ఎక్కడున్నా, ఒక వేళ నిద్రపోతున్నా ఈ టైమ్‌లో లేచి బ్రష్ చేసుకోటానికి కానీ, టిఫిన్ చేయటానికి కానీ, నా దగ్గరకు వస్తాడనే నమ్మకంతో నేను బ్రష్ చేసుకొని ఆనంద్ కోసం ఎదురు చూస్తూవున్నాను. ఎంతసేపు చూసినా ఆనంద్ రాలేదు ట్రైన్ మాత్రం బైల్దేరింది ఒక వేళ ఆనంద్ ట్రైన్‌లో వుంటే ఎట్టి పరిస్థితిలో నాదగ్గరకు వచ్చేవాడు కాబట్టి ఆనంద్ ట్రైన్‌లో లేడని కన్ఫామ్ ఐపోయింది. నేను చాలా వొత్తిడికి, టెంక్షన్‌కి, భయానికి లోనైయ్యాను. నాకు ఏమీ అర్థంకాక విజయవాడలోనే దిగేయాలనుకొన్నాను. ఒక వేళ నేను దిగేస్తే .....ఆనంద్ ట్రైన్‌లోనే వుంటే ..... తన పరిస్థితి ఏమిటి!!?......అనుకొన్నాను. నా దగ్గర డబ్బులు, బ్యాగ్స్ అన్నీ వున్నాయి. అదే టైంలో ఇద్దరు రైల్వే పోలీసులు (బాణం గుర్తు లోగో యూనిఫామ్ వాళ్లు వేసుకొని వున్నారు) నేను వున్న బోగీలోకి ఎక్కారు. ఇమీడియట్‌గా వారికి జరిగిన విషయం చెప్పాను.

రైల్వే పోలీసులకు ఆనంద్ ఐ.డి. కార్డు మరియు రిజర్వేషన్ టికెట్ చూపించాను. నాకు మా తమ్ముడు శింగరాయకొండ నుండి కనపడలేదని చెప్పాను. మేము మాట్లాడుకొన్న విషయం అక్కడ కూర్చున్నవారందరికీ తెలిసింది. ఆనంద్ నిలబడివున్న డోర్ పక్క సీట్లో వున్న అతనిని నేను చూపిస్తూ .....ఇతను కూడా ఆటైంలో అక్కడే వున్నాడని చెప్పాను. ఆ రైల్వే పోలీసులు అతనిని మా తమ్ముడు గురించి అడగగా ....... నేను ఈ సీట్లో కూర్చొనే ముందు ఒక అతను ఆ డోర్ దగ్గర నిలబడివుండటం చూసాను. నేను నిద్రపోయిన తరువాత ఏంజరిగిందో నాకు తెలియదు అని సమాధానం చెప్పాడు.

మీ తమ్ముడు ఎటువైపు వెళ్లాడో నీకేమైనా తెలుసా! అని రైల్వే పోలీసులు అడిగారు. దక్షిణం వైపు వెళ్లి వుండవచ్చని సమాధానం చెప్పాను. మేము ఇక్కడే వుంటాము. నీవు వెళ్లి ఒక సారి చూసిరా......! అన్నారు. మా బ్యాగ్స్, ఆనంద్ రిజర్వేషన్ టికెట్, ఐ.డి. కార్డ్ అన్నీ వాళ్ల దగ్గరే వుంచి నేను ఆనంద్‌ని వెతకడానికి వెళ్లాను. దక్షిణం వైపు వున్న బోగీ మొత్తం


AANANDHA SAPTHAKAMU

వెతికాను. ఎక్కడా ఆనంద్ కనపడలేదు. ఆవిషయాన్నే వారికి చెప్పాను. ఈ సారి ఉత్తరం వైపు వెళ్లి వెతకమన్నారు. మా తమ్ముడు అటువైపు వెళ్లివుండడని చెప్తే ఎందుకైనా ఒక సారి వెళ్లి వెతికి రా...! అన్నారు. ఒక పోలీసు మాత్రం నేను కూడా నీతోపాటుగా వస్తాను వెల్దాం.. రా అన్నాడు. ఇద్దరం వెళ్లి వెతికాము అక్కడ కూడా ఆనంద్ కనపడలేదు.

నేను ఆ టైంలో వాళ్లతో **'మా ఇంటికి ఫోన్ చేస్తాను..... ఇక్కడ ఎవరి ఫోన్ అన్నా ఇప్పించమన్నాను.'** వాళ్లు ఒక ఆమెను అడిగి ఫోన్ తీసిచ్చారు, కానీ అందులో చార్జింగ్ తక్కువ వుండే సరికి మా ఇంటికి ఫోన్ చేయలేక పోయాను. ఖమ్మం స్టేషన్‌లో ట్రైన్ అగుతుంది, నువ్వు అక్కడ దిగి సెకండ్ క్లాస్ బోగీ అంతా తొందరగా చూసి, తిరిగి మనమున్న బోగిలోకి రావాలి అన్నారు ఆ రైల్వే పోలీసులు. నాకు తోడుగా ఒక పోలీసు కూడా వచ్చాడు. మేము అలాగే ట్రైన్ ఆగగానే దిగి సెకండ్ క్లాస్ బోగీ అంతా చూసాము. అక్కడ కూడా ఆనంద్ లేదు. తిరిగి మాబోగీలో ఎక్కే సమయానికి ట్రైన్ కదిలింది.

మేమిద్దరం సెకండ్ క్లాస్ బోగీలోనే వుండిపోయాము. దీని తరువాత డోర్నకల్ స్టేషన్ వస్తుంది. అక్కడ దిగి మన బోగీలోకి వెళ్దామన్నాడు ఆ పోలీసు. మేమిద్దరం తరువాతి స్టేషన్ వచ్చే వరకు అక్కడే వున్నాము. తరువాతి స్టేషన్‌లో (డోర్నకల్) ట్రైన్ స్లో అయ్యిందే కానీ ఆగలేదు. నేను దిగాలనుకొన్నాను. ట్రైన్ మూవింగ్‌లో వుంది.......... ట్రైన్ దిగకూడదు అని పోలీస్ నన్ను వారించాడు. దీని తరువాతి స్టేషన్ వరంగల్ అక్కడ తప్పకుండా ఆగుతుందని ఆ పోలీసు అన్నాడు. ఆ సమయంలోనే నేను ఆనంద్ గురించి జరిగిన విషయాలన్నీ అతనికి చెప్పాను. ఆనంద్‌కి ఏమైనా జరిగివుంటుందేమోనని నేను అనుకొంటూ వుండగా.....ఆ పోలీసు నాకొక సలహా ఇచ్చాడు. అదేంటంటే........... 'వరంగల్ స్టేషన్‌లో దిగింతరువాత ఆర్.పి.ఎఫ్. వాళ్లకు కంప్లైంట్ ఇవ్వు...... వాళ్లు కంప్లైంట్ తీసుకోకపోతే, విజయవాడకు వెళ్లి అక్కడ కంప్లైంట్ ఇవ్వమన్నారు. అలా మాట్లాడుతుండగా చాలా సమయానికి వరంగల్ స్టేషన్ వచ్చింది.

వరంగల్ స్టేషన్‌లో దిగి.... ఇంతకముందు మేమున్న బోగీలోకి వెళ్లింతరువాత ఆ ఇద్దరు పోలీసులు మీ తమ్ముడు ఈ ట్రైన్‌లో లేదు, ఇప్పుడు నువ్వేంచేయాలనుకొంటున్నావు. నా అభిప్రాయం చెప్పమన్నారు. **'నేను ఈ ట్రైన్‌లోనే ఘోరఖ్‌పూర్‌కి వెళ్లి అక్కడ ఉన్న అధికారులకు (మా తమ్ముడు పని చేసే ఆఫీసులోని అధికారులకు) జరిగిన విషయం చెప్తానన్నాను'.** నేను పై విషయం చెప్పిన తరువాత...వారు అడిగిన మొదటి ప్రశ్న **'నీకు ఘోరఖ్‌పూర్ తెలుసా?'** ఘోరఖ్‌పూర్ నీకు తెలియకపోతే నీవు అక్కడకు పోవటం అనవసరం.... నీవు ఇమీడియట్‌గా ఇక్కడ దిగిపో..........అన్నారు.



AANANDHA SAPTHAKAMU

నాకు వాళ్లు చెప్పిందే కరెక్టనిపించి మా బ్యాగ్స్ తీసుకొని దిగుతుండగా ఆ రైల్వే పోలీసులు **నా అడ్రస్, ఫోన్ నెంబరు** రాసివ్వమన్నారు. నేను వాళ్లకు డీటేల్డ్‌గా రాసిచ్చాను. వాళ్లల్లో ఒక పోలీసు నాతో పాటే ట్రైన్ దిగి ఆ ప్లాట్‌ఫామ్ మీద వున్న ఎస్.టి.డి. బూత్ దగ్గరకు వచ్చి మీ ఇంటికి కాల్ చేసి విషయం చెప్పమన్నాడు. మా ఇంటికి ఫోన్ చేస్తే ఫోన్ కలవలేదు, ఎంగేజ్ వచ్చింది. మరలా......మరలా మూడు సార్లు ఫోన్ చేసాను, కానీ ఫోన్ కలవలేదు. అదే సమయానికి వరంగల్ స్టేషన్ నుండి ట్రైన్ కదలటం ప్రారంభమైంది. అప్పటిదాకా నాదగ్గరవున్న ఆ పోలీస్ నాకు " **బాయ్** " చెప్పి వెళ్లిపోయాడు.

---

**:: నాల్గవ భాగం ::**

---

నేను వరంగల్ రైల్వే స్టేషన్‌లోని రైల్వే పోలీస్ స్టేషన్‌కు వెళ్లి జరిగిన విషయం రైల్వే పోలీసులకు చెప్పాను. కానీ వాళ్లు నా కంప్లైంట్ తీసుకోలేదు. **'మీ తమ్ముడు కనపడకుండా పోయింది శింగరాయకొండ నుండి అంటున్నావు కాబట్టి మీరు విజయవాడ రైల్వే పోలీస్ స్టేషన్‌లో కంప్లైంట్ ఇవ్వండి ఇక్కడ కాదు అన్నారు.'** ఇంక చేసేది ఏమీలేక విజయవాడకు టికెట్ తీసుకోటానికి స్టేషన్ నుంచి బయటకు వచ్చాను. బైట ఒక ఎస్.టి.డి. బూత్ కనపడింది.

ఆ ఎస్.టి.డి. బూత్ నుండి మరొక సారి ఇంటికి ఫోన్ చేసాను. ఈ సారి ఇంటికి రింగ్ అయ్యింది. మమ్మీ నా కాల్‌ని రిసీవ్ చేసుకొన్నది. శింగరాయకొండ నుండి ఆనంద్ నాకు కనపడలేదు అని చెప్పాను. అప్పుడు మమ్మీ **'నిన్ను పంపించింది ఎందుకు..!? ఆనంద్‌ని చూసుకొంటావనేగా....!!'** అన్నది. నేను ఇప్పుడు విజయవాడకు టికెట్ తీసుకొంటున్నాను, అక్కడకు వచ్చింతరువాత (విజయవాడకు) మళ్లీ ఫోన్ చేస్తానని ఫోన్ పెట్టేసాను. అప్పుడు సుమారుగా ఉదయం గం॥ 10 లేదా 10.30 ని॥ ఐవుంటుంది. విజయవాడకు టికెట్ తీసుకొని ట్రైన్ ఎక్కేసాను.

తిరిగి మరలా విజయవాడకు వెళ్లి అక్కడ ఆర్.పి.ఎఫ్. వాళ్లతో జరిగిన విషయం తెలియపరిచాను. నువ్వు కంప్లైంట్ ఇక్కడ కాదు ఇవ్వాల్సినది.......శింగరాయకొండకు ఒంగోలు మెయిన్ స్టేషన్ కాబట్టి నువ్వు వెళ్లి ఒంగోల్ రైల్వే స్టేషన్ లోని ఆర్.పి.ఎఫ్. వాళ్లకు కంప్లైంట్ చెయ్యమన్నారు. అప్పుడు స్టేషన్ బయటకు వచ్చి మన ఇంటికి ఫోన్ చేసాను. మమ్మీ నా ఫోన్ కాల్ రిసీవ్ చేసుకొని, డాడీకి ఇచ్చింది. నేను డాడీతో జరిగిన విషయం చెప్పి, నన్ను ఒంగోల్ ఆర్.పి.ఎఫ్. వాళ్లకు కంప్లైంట్ ఇవ్వమన్నారు అని చెప్పాను. ప్రస్తుతం ఒంగోల్‌కి టికెట్ తీసుకోటానికి వెళ్తున్నాను అంటే, నువ్వేమీ ఒంగోల్‌కి వెళ్లబల్లేదు. ఇంటికి

AANANDHA SAPTHAKAMU

వచ్చేయి. నేను ఒంగోలుకి వెళ్లి కనుక్కొంటానని డాడీ అన్నాడు. సరే అని చెప్పి ఒంగోల్‌కి కాకుండా నెల్లూరుకి రైల్వే టికెట్ తీసుకొని నెల్లూరికి బయలు దేరాను. నేను నెల్లూరుకి వచ్చేటప్పటికి టైం రాత్రి సుమారుగా గం॥ 10.45 నుండి 11.25 ని॥ మధ్య అయి-వుంటుంది.

---

**:: ఐదవ భాగం ::**

---

ఇంటికి వచ్చి అక్కడ జరిగిన విషయమంతా మమ్మీతో చెప్పాను. ఆనంద్ నాకు శింగరాయకొండ నుండి కనపడలేదు. ఆనంద్ అక్కడే దిగేసివుంటాడని చెప్తే.......... ఉదయాన్నే అక్కడకు వెళ్లిరమ్మని (శింగరాయకొండ) మమ్మీ నాతో అన్నది. నేను ఈరోజు ఉదయం నుంచి ఏమీ తినలేదని మమ్మీతో చెప్తే..... మీరు ట్రైన్‌లో తినటానికి చపాతీలు, పులిహోరా మరియు వడలు కట్టిచ్చానుగా అవి తినకూడదా....! అని మమ్మీ అంటే **“తమ్ముడు కనపడలేదనే టెంక్షన్‌లో వుండి అవి తినలేదన్నాను......”** తరువాత మమ్మీ అన్నం పెడ్తే తిన్నాను, ఆ టైంలో ఇంట్లో మమ్మీ మాత్రమే వుంది. డాడీలేదు బహుషా ఒంగోల్‌కి వెళ్లి వుండవచ్చు.

ఆరోజు రాత్రంతా నిద్రపోయి పక్క రోజు (జూన్ 19, 2005) ఉదయం గం॥ 6.00 లకు లేచి ఆర్.టి.సి.(నెల్లూరు) బస్టాండ్‌కు వెళ్లి శింగరాయకొండకు వెళ్లే బస్ ఎక్కాను. ఆబస్సు నెల్లూరు నుండి కావలి మరియు శింగరాయకొండలో దింపేసింది. శింగరాయ-కొండకి ఇంతకముందు ఎప్పుడూ వెళ్లలేదు (అక్కడికి వెళ్లటం ఇదే మొదటి సారి), శింగరా-యకొండ బస్‌స్టాండ్ నుంచి బైటకు వచ్చి, టిఫిన్ చేసాను. ఆ టిఫిన్ అంగడి ఆమెను ఇక్కడ నుండి రైల్వే స్టేషన్‌కి ఎటువెళ్లాలని అడిగితే ఇంకొద్దిగ ముందుకు వెళ్తే తూర్పు వైపున ఒక కూరగాయల మార్కెట్ వుంటుంది...ఆ సందుగుండా వెళ్తే శింగరాయకొండ రైల్వే స్టేషన్ వస్తుందని చెప్పింది. ఆమె చెప్పిన ప్రకారము గానే రైల్వే స్టేషన్‌కు వెళ్లాను.

శింగరాయకొండ రైల్వే స్టేషన్ లోపలకి వెళ్లి ఆనంద్ అక్కడేమైనా వున్నాడేమోననే అనుమానంతో తన కోసం వెతికాను, అక్కడెక్కడా కనపడలేదు. ఒకవేళ రైల్వే స్టేషన్ చుట్టుపక్కలేమైనా వుండివుండవచ్చునే ఆశతో రైల్వే ట్రాక్ పక్కన వున్న (తూర్పు వైపునవున్న) ఒక చిన్న మట్టి రోడ్ గుండా నడుచుకొంటూ దక్షిణం వైపుగా వెళ్లాను. కొంత దూరం వెళ్లిన తరువాత అక్కడ ఒక రైల్వే గేటు కనపడింది. రైల్వే గేట్ ఆపరేటింగ్ రూమ్‌లో ఇద్దరు రైల్వే ఎంప్లాయిస్ కనపడ్డారు. వారితో.......... **‘మా తమ్ముడూ, నేనూ ట్రైన్‌లో ప్రయాణం చేస్తుండగా శింగరాయకొండ నుండి మాతమ్ముడు కనపడలేదు,’** ఒక వేళ శింగరాయకొండ-

AANANDHASAPTHAKAMU

లోనే దిగి వుండవచ్చునుకుంటున్నాను......మీకేమైనా ఈచుట్టుపక్కల కనపడ్డాడా! అని వారిని అడిగాను. వారిలో ఒక అతను మీతమ్ముడు ఏ కలర్ షర్ట్ వేసుకొనివున్నాడు అని అడిగాడు. గ్రీన్ టీ షర్ట్ అని జవాబిచ్చాను. అతను కొద్దిగ సేపు ఆలోచించి ఇంతక ముందు ఒక అతను ఇక్కడ కూర్చోని వున్నాడు....అతను నువ్వు చెప్పినట్లే గ్రీన్ టీ షర్ట్ వేసుకొని వున్నాడు. నీవు ఇక్కడకు వచ్చేముందే వెళ్లిపోయాడు...బహుషా మీ తమ్ముడు ఈ చుట్టుపక్కలే వుండి-వుండవచ్చు తొందరగా వెళ్లి చూడు అని సమాధానం చెప్పాడు.

నేను ఆ చుట్టు పక్కలంతా చూసాను ఆనంద్ ఎక్కడా కనపడలేదు. అటునుంచి నేరుగా బస్టాండుకు వెళ్తూ.... ఇంటికి ఫోన్ చేసాను. మమ్మీ ఫోన్ రిసీవ్ చేసుకొని ఆనంద్ ఏమైనా కనపడ్డాడా!... అని అడిగింది. నాకు ఇప్పటి వరకూ ఆనంద్ కనపడలేదు, ఇక్కడే ఎక్కడో వుండి వుంటాడని ఇక్కడివారు కూడా అంటున్నారు అని మమ్మీతో చెప్పాను.

ఎస్.టి.డి బూత్ నుండి బయటకు వచ్చి, శింగరాయకొండ బస్టాండ్‌కి బయలు-దేరాను. బస్టాండ్‌కు వెళ్లింతరువాత అక్కడ కొద్దిగ సేపు ఆలోచిస్తూ కూర్చున్నాను. ఆనంద్‌కి ఏమైనా జరిగివుంటే పేపర్లో వేసి వుంటారని మనస్సులో అనుకొని బస్టాండ్‌లోని బుక్‌షాపు అతన్ని పేపర్లు (ఈనాడు, వార్తా మరియు ఆంధ్రజ్యోతి) చదివిస్తానని రిక్వస్ట్‌గా అడిగాను. అతను పై మూడు పేపర్లు ఇచ్చాడు. నేను ఆ మూడు పేపర్ల యొక్క జిల్లా ఎడిసన్స్‌నే తీసుకొని తొందర తొందరగా చదివి తిరిగి అతనికి ఇచ్చేసాను. నేను జిల్లా ఎడిషన్స్‌ని మాత్రమే చదవటానికి గల కారణం యాక్సిడెంట్స్ వార్తలు ఎక్కువగా జిల్లా ఎడిసన్స్‌లోనే వస్తాయి. నేను చదివిన పై పేపర్లలో చనిపోయిన వార్తలు మరియు ట్రైన్ యాక్సిడెంట్‌కి సంబంధించిన వార్త లేమీ లేవు. నాకు కొద్దిగ ధైర్యం వచ్చింది. ఆనంద్‌కు ఖచ్చితంగా ఏమీ జరిగి వుండదనుకొన్నాను.

ఒక వేళ ఆనంద్ శింగరాయకొండ లోనే వుంటే నిన్న రాత్రంతా ఎక్కడ నిద్రపోయి-వుంటాడు. ఉదయాన్నే బ్రెష్ ఎక్కడ చేసి వుంటాడు. టిఫిన్ ఎలా చేసి వుంటాడు. ఆనంద్ దగ్గర డబ్బులు లేవు కదా.....! ఎలా వున్నాడో ఏమో.....!! అనుకొంటూ మళ్లీ వెతకడం ప్రారంభించాను. శింగరాయకొండలోని ప్రతి సందూ... ప్రతి గొందీ... ప్రతి వీధీ వెతికాను. శింగరాయకొండ పంచాయితీ ఆఫీసు లోపలికి వెళ్లి ఆ ఆఫీసులోని వారందరినీ ఆనంద్ గురించి అడిగాను.... ఎవ్వర్నడిగినా మాకు తెలియదన్నారు. శింగరాయకొండలో చూడదగ్గ ప్రదేశాలేమైనా వున్నాయా.... అని అక్కడ ఒక అతనిని అడిగాను. అతను సాయిబాబా గుడి ఇక్కడ చాలా ఫ్యామస్ అని జవాబిచ్చాడు. ఒక వేళ ఆనంద్ సాయిబాబా గుడికి ఏమైనా వెళ్లి

AANANDHA SAPTHAKAMU

వుంటాడా.....!!? అనే అనుమానంతో అక్కడికి కూడా వెళ్లి చూసాను కానీ ఆనంద్ కనపడ–లేదు.

సాయిబాబా గుడి నుండి బయటికి వచ్చి కొంత దూరం వెళ్లింతరువాత ఒక ఎస్.టి.డి. బూత్ వచ్చింది. అందులో నుండి మన ఇంటికి ఫోన్ చేశాను. మమ్మీ రిసీవ్ చేసుకొంది. నేను ఆనంద్ గురించి ఇక్కడ వెతుకుతున్నాను. ఎక్కడా కనపడలేదు. కనపడితే మరలా ఫోన్ చేసి చెప్తానన్నాను. ఇంతలో మమ్మీ ఫోన్‌ని ఉమాకి (ఉమా నాకు, ఆనంద్‌కి బాల్య స్నేహితుడు) ఇచ్చింది. అప్పుడు ఉమాతో 'శింగరాయకొండలో ఆనంద్‌కి ఎవరైనా ఫ్రెండ్స్ వున్నారా.....!? అని అడిగాను, దానికి ఉమా శింగరాయకొండలో ఆనంద్‌కి ఒక ఫ్రెన్డ్ వున్నాడు...అతని పేరు గానీ, అడ్రస్సు గానీ నాకు తెలియదు అని నాతో అన్నాడు. నీవు ఫోన్‌లో నాకేమైనా చెప్పాలంటే 'మీ ఇంటి ఫోన్ నెంబరు కాకుండా, సుధా (సుధా కూడా మా స్నేహితుడు) ఫోన్ నెంబర్‌కి ఫోన్ చెయ్యి అని ఆ నెంబరు చెప్పాడు. తరువాత కోటా (కోటా మా స్నేహితుడు) తో కూడా మాట్లాడాను.

అలా రోడ్డు మీద తిరుగుతుండగా.....ఉదయం రైల్వే గేటు దగ్గర మాట్లాడిన రైల్వే ఉద్యోగి టీ తాగడానికి నేను వున్న రోడ్డు మీదకే వచ్చాడు. ఆరోడ్డు మీద వున్న టీ బొంకు దగ్గర అతనిని మళ్లీ కలిసాను, ఇద్దరం కలిసి టీ తాగాము. అదే సమయంలో అతను టీ తాగుతూ **వార్త దిన పత్రిక** చదువుతుండగా.....మాతమ్ముడు ఇప్పటివరకూ కనపడలేదని అతనితో బాధ పడుతూ చెప్పాను. అతను ఠక్కుమని ఈ వార్త చూడు అని నాకు ఆ వార్త చూపించాడు, ఆ వార్త.....వార్త దిన పత్రికలోని మెయిన్ ఎడిషన్‌లో వేసి వున్నారు. అదేంటంటే " **46 సంవత్సరముల వ్యక్తి ఉలవపాడు, శింగరాయకొండ మధ్యలో ట్రైన్ యాక్సిడెంట్ జరిగి చనిపోయాడని** " వుంది.

ఆ వార్తను చదివిన తరువాత మా తమ్ముడికి వయస్సు 27 సంవత్సరాలని చెప్పాను. అంతే కాక మాతమ్ముడు శింగరాయకొండ నుండి కనపడలేదు. ఉలవపాడు నుండి కాదని చెప్తే, పేపర్ వాళ్లు అట్లాగే వ్రాస్తారు అని చెప్పగానే-- నాకు మళ్లీ టెంక్షన్ మొదలైంది. శరీరమంతా ఒక రకమైన భయం ఆవరించింది. ఆ వార్త నిజమో, కాదో నిర్ధారించు–కోటానికి వార్త దిన పత్రికను కొన్నాను. నా టెంక్షన్‌ను చూసిన ఆ షాపు యజమాని మమ్మల్ని ఏంజరిగింది బాబూ.....!? అని అడిగాడు. ఆ షాపతనికి ఆ రైల్వే ఉద్యోగి జరిగిన విషయం చెప్పాడు.

AANANDHA SAPTHAKAMU

టీ షాపునుండి బైటకు వస్తూ ఆ రైల్వే ఉద్యోగి తనతో పాటూ నన్నూ రమ్మని చెప్పి, తనతో పాటుగా ఆ రైల్వే గేటు దగ్గరకు తీసుకొని వెళ్లాడు. తనతో పాటూ పనిచేసే అతనితో మాట్లాడుతూ.....! నేను...ఈ అబ్బాయితో శింగరాయకొండ రైల్వే స్టేషన్ దాకా వెళ్లివస్తాను కొద్దిగ చూసుకొంటూవుండు అని చెప్పి నాతో పాటూ శింగరాయకొండ రైల్వే స్టేషన్‌కు బయలు దేరాడు.

నేను నీకు సహాయం చేస్తాను, ప్రతిఫలంగా నాకు **ఒక క్వార్టర్ మందుకు డబ్బులు ఇస్తావా....!** అని అడిగాడు. నేను తప్పకుండా ఇస్తానన్నాను. శింగరాయకొండ రైల్వే స్టేషన్‌కి వెళ్లింతరువాత స్టేషన్ నుండి ఒంగోలు రైల్వే స్టేషన్‌కి ఫోన్ చేసి వార్త పేపర్లో వేసిన న్యూస్ గురించి విచారణ చేసాడు. చనిపోయిన అతని అన్న శింగరాయకొండ రైల్వే స్టేషన్‌లో వున్నాడు. అతనికి చనిపోయినతని వివరాలు కావాలంట; అని ఒంగోలు రైల్వే స్టేషన్ వారిని అడిగాడు. ఒంగోలు రైల్వే స్టేషన్ వారు ఆ రైల్వే ఉద్యోగికి ఇచ్చిన సమాచారం ఏమిటంటే....**"చనిపోయిన వ్యక్తికి సుమారుగా 27 లేదా 28 సంవత్సరాల మధ్య వయస్సు వుంటుందని చెప్పారు మరియు ఆ బాడీని ఇప్పుడే పోస్టుమార్టం నిమిత్తం ఒంగోలు గవర్నమెంట్ హాస్పిటల్‌కి పంపుతున్నాము ఒక వేళ అతను ఒంగోలుకి వచ్చేపనైతే గవర్నమెంట్ హాస్పిటల్‌కి రమ్మని చెప్పండి...!"** అని వారు చెప్పిన విషయం ఆ రైల్వే ఉద్యోగి నాకు చెప్పాడు.

అతను పై విషయం చెప్పగానే ఆనంద్ చనిపోయాడని నిర్ధారణ అయిపోయింది. నాకు అతనితో ఏమి మాట్లాడాలో అర్థం కాలేదు. సైలెంటుగా వుండి పోయాను. అతను నాతో తొందరగా ఒంగోలు గవర్నమెంట్ హాస్పిటల్‌కి వెళ్లమన్నాడు దానికి నేను సమాధానం చెప్తూ నీవు ఇప్పటి వరకు నాకు చేసిన సహాయానికి కృతజ్ఞుడ్ని అని చెప్తూ **ఒక క్వార్టర్ మందుకు రూ. 50/- ఇవ్వబోతే** నీవు చాలా బాధలోవున్నట్లున్నావు, నీదగ్గర తీసుకోవటం అంతబాగుండదు, నువ్వే వుంచుకో....అని చెప్పాడు. నీతో పాటూ నేనూ కూడా రోడ్డు దాకా వచ్చి బస్సు ఎక్కిస్తాను అని చెప్పి నాతో పాటుగా రోడ్డు మీదకు వచ్చాడు.

మేమిద్దరం బస్సుకోసం నిలబడి వుండగా మాకు ఎదురుగా ఒక ఎస్.టి.డి. బూత్ కనపడింది, బస్సు వచ్చేలోపు మా అమ్మతో మాట్లాడి వస్తానన్నాను. అతను మీ అమ్మతో ఏంచెప్తావని అడిగాడు...మాతమ్ముడు చనిపోయాడని చెప్తానన్నాను. అలా చెప్పవద్దు దెబ్బలు తగిలి హాస్పిటల్లో వున్నాడని చెప్పమన్నాడు. నేను అతను చెప్పమన్నట్లే మా అమ్మకు ఫోన్‌లో చెప్పాను.

AANANDHA SAPTHAKAMU

మీరు తక్షణమే బయలుదేరి ఒంగోలు గవర్నమెంట్ హాస్పిటల్‌కి రమ్మని చెప్పి ఫోన్ పెట్టేసింతరువాత రెండవ సారి ఉమాకి ఫోన్ చేసాను, ఉమాకి మాత్రం ముందుగా ఆ రైల్వే ఉద్యోగే సుధా ఫోన్ నెంబరుకి ఫోన్ చేసి నేను కిరణ్ ఫ్రెండ్‌ని, కిరణ్ నీతో మాట్లాడుతాడని ఫోన్ నా చేతికిచ్చాడు. నేను ఆ ఫోన్‌ని అందుకొని **" ఉమా....ఆనంద్ ఇంక లేదు.....!! "** అని చెప్పగానే, ఉమా కొద్దిగ సేపు సైలెంటుగా (బాధ పడినట్టుగా నాకు అనిపించింది) వుండిపోయాడు. నేను ఒంగోలు గవర్నమెంట్ హాస్పిటల్‌కి వెళ్తున్నాను అని చెప్పి ఫోన్ పెట్టేసాను. అదే సమయానికి ఒంగోల్‌కి వెళ్లే బస్సు వచ్చి ఆగింది. నేను ఆ బస్సు ఎక్కగానే ఆ రైల్వే ఉద్యోగి లేడీ కండక్టర్‌తో ఇతనిని ఒంగోలు గవర్నమెంట్ హాస్పిటల్ దగ్గర దింపండని చెప్పి బస్సు కదలగానే బాయ్ చెప్పి వెళ్లిపోయాడు.

---

## :: ఆరవ భాగం ::

---

బస్సు ఒంగోలు గవర్నమెంటు హాస్పిటల్ దగ్గరకు రాగానే ఆ లేడీ కండక్టరు **' ఇదే గవర్నమెంట్ హాస్పిటల్ ఇక్కడే దిగుతావా....! "** అని అడిగింది దానికి సమాధానంగా నేను ఇక్కడే దిగుతానని చెప్పి దిగేశాను. ఆరోజు ఆదివారం (19–06–2005) ఎదురుగా ఉన్న ఆ గవర్నమెంట్ హాస్పిటల్ లోనికి వెళ్లి అక్కడ వున్న హాస్పిటల్ స్టాఫ్‌తో ఆనంద్ గురించిన వివరాలు అడిగాను. వారు నాకు చెప్పిన సమాధానం ఏమిటంటే.... **" నువ్వు వచ్చే ముందే పోస్ట్ మార్టం చేసుకొని రైల్వే వాళ్లు ఆ బాడీని తీసుకొని వెళ్లారని "** చెప్పారు.

అక్కడ నుండి ఆటోలో నేరుగా రైల్వే స్టేషన్‌కి వెళ్లి, రైల్వే పోలీస్ స్టేషన్ లోని పోలీసులకు నా గురించి చెప్పి, మా తమ్ముడు గురించి ఇక్కడకు వచ్చానని చెప్పాను. ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవాలి.........ఆ సమయం వరకు ఆ చనిపోయిన వ్యక్తి ఆనందేనని నేను నిర్ధారణ చేసుకోలేదు, ఎందుకంటే నేను ఆ బాడీని చూడలేదు కదా....! ఆనంద్ అయ్యి వుండవచ్చు మరియు కాక పోనూ వచ్చు. ఆనంద్ అయ్యి వుంటాడనే అనుమానం మాత్రమే నాకు వుంది. ఇప్పటి వరకు ఆ చనిపోయిన అతను ఆనందా లేక ఇంకెవరైనా ఐవుంటారా....! అనే విషయం ఇప్పటి వరకు నిర్ధారణ కాలేదు. అంటే నేను చూడలేదు. కానీ అదే సమయానికి శింగరాయకొండకు దగ్గర్లో చనిపోయాడు కాబట్టి ఆనంద్ అయ్యి వుంటాడనే అనుమానం మాత్రమే నాకు వుంది.

ఒంగోలు రైల్వే పోలీసులు నన్ను ఆనంద్ గురించిన కొన్ని వివరాలు అడిగారు. అవేమిటంటే... మీ తమ్ముడు ఏ కలర్ షర్ట్ మరియు ఫ్యాంట్ వేసుకొన్నాడు..? దానికి సమాధానంగా మా తమ్ముడు గ్రీన్ టీ షర్ట్ మరియు బ్లాక్ ఫ్యాంట్......ఆ బ్లాక్ ఫ్యాంట్‌కి రెండు

ANANDHA SAPTHAKAMU

వైపులా ఆరంజ్ కలర్ రెండు సన్నని గీతలు వుంటాయని సమాధానం చెప్తూ... ఒక సారి మా మమ్మీని కూడా అడిగి చెప్తానని ఫోన్ చేయటానికి బైటకు వెళ్తుంటే.... అక్కడున్న పోలీసులలో ఒక అతను తన మొబైల్ ఫోన్‌ని నాకిచ్చి ఇందులో నుంచి మీ మమ్మీకి ఫోన్ చేసి తమకు విషయం చెప్ప మన్నాడు.

నేను మమ్మీకి ఫోన్ చేసి తమ్ముడు ఏ కలర్ షర్ట్ వేసుకొన్నాడని అడగగా పై సమాధానమే చెప్తూ (గ్రీన్ టీ షర్ట్ మరియు బ్లాక్ ఫ్యాన్ట్)...నేనూ, మల్లికా పెదనాన్నబస్సులో ఒంగోలుకి వస్తున్నామని మమ్మీ చెప్పింది. అప్పుడు నేను మమ్మీతో ఒంగోలు గవర్నమెంట్ హాస్పిటల్‌కి కాకుండా నేరుగా రైల్వే స్టేషన్‌కి రమ్మన్నాను. అలాగే ఉమాకి కూడా ఫోన్ చేసి నేను ప్రస్తుతం ఒంగోలు రైల్వే స్టేషన్‌లో వున్న పోలీసు స్టేషన్‌లో వున్నాననిచెప్పి ఫోన్ ఆ పోలీసుకు ఇచ్చేసాను.

తరువాత నాకు ఆనంద్ యొక్క డెడ్‌బాడీ చూపించారు. ఆబాడీని రైల్వే స్టేషన్‌కి తూర్పు వైపున రైల్వే స్టేషన్ బైట ప్లాస్టిక్ కవర్లతో కట్టేసి ఒక పాత రిక్షాలో పెట్టి వుంది. నేను అక్కడకు వెళ్లగానే ఇప్పుతీసి చూపించమంటారా....! అని ఒక కూలీ అతను అడిగాడు (ఆనంద్ బాడీని శింగరాయకొండ నుంచి తీసుకొని రావటానికి పోలీసులు ఇద్దరు కూలీలను పెట్టారు) అతనితో ఇప్పుడే ఆ కవర్లు తీయవద్దు, మావాళ్లు వచ్చింతరువాత తీయ్యండని చెప్పాను. కొంత సేపటికి ఉమా, సాయి (మా స్నేహితుడు) అక్కడకు వచ్చారు. వారితో విషయం చెప్పాను. ఉమా వాళ్లతో మాట్లాడుతూ బాడీ మీద కప్పిన కవర్లు తీయండి మేము చూస్తామన్నాడు. కవర్లు తీసింతరువాత ఆనంద్ ఫేస్ చూసాము. ఆనంద్ పొట్టను కోసి కుట్లు వేసివున్నారు. చాలా వాసన కూడా వస్తున్నది. ఇంతలో ఉమా మాట్లాడుతూ ఆనంద్ బాడీ బాగా **డీకంపోస్** అయిపోయిందన్నాడు.

తరువాత మమ్మీ, మల్లికా పెదనాన్న వచ్చారు. ఆ తరువాత చాలా సమయానికి డాడీ కూడా వచ్చాడు. మమ్మల్ని రైల్వే పోలీసు స్టేషన్ యొక్క ఇన్‌స్పెక్టర్ వచ్చే వరకూ వుండ–మన్నారు. అంతలోగా మాచేత తెల్లకాగితాల మీద సంతకం చేయించుకొన్నారు. కూలీలకు డబ్బులు కట్టమన్నారు. వాళ్ల మామూల్లు ఇవ్వమన్నారు. కూలీవాళ్లకు మాత్రమే డబ్బులు ఇచ్చి, పోలీసులకు మళ్లీ ఇస్తామని చెప్పాము.

తరువాత ఎస్.ఐ. వచ్చి అన్నీ వివరాలూ అడిగి తెలుసుకొన్నాడు. పోలీసులకు వీళ్లబ్బాయి ఫ్యాంట్, షర్ట్ ఇవ్వమన్నాడు. మమ్మీ అవి మాకెందుకు పడేయండని చెప్పింది. డాడీని కారు మాట్లాడుకొని రమ్మని చెప్పి, ఉమా, నేనూ, సాయి ప్లాస్టిక్ కవర్లు, వాసన

AANANDHA SAPTHAKAMU

రాకుండా పన్నీరు (కొంత డబ్బులు ఉమా, సాయి పెట్టారు) చాలా దూరం వెళ్లి తీసుకొని వచ్చాము...ఆరోజు ఆదివారం ఐనందువల్ల షాపులు తీలేదు. ఆ కవర్లు కూలీ వాళ్లకు ఇచ్చి బాగా కట్టమన్నాము, వాళ్లు కట్టేసింతరువాత, డాడీ కారు తీసుకొని వచ్చాడు. ఆనంద్ బాడీని కారు వెనుక డిక్కీలో పెట్టించాము. అంతా ఐపోయింతరువాత ప్లాస్టిక్ కవర్లు ఇప్పండి నేను ఆనంద్ మొహం చూడాలని, మమ్మీ ఏడుస్తూ కూర్చొన్నది. ఆనంద్ బాడీ మీద ఉన్న ప్లాస్టిక్ కవర్లను విప్పటానికి కారు ఓనరు ఒప్పుకోలేదు.

తరువాత నేనూ, మమ్మీ, డాడీ, మల్లికా పెదనాన్న, డ్రైవర్ మరియు ఆనంద్ బాడీతో కారు బయలుదేరింది. ఉమా, సాయీ ఒంగోలు నుండి నెల్లూరుకి బస్సులో వచ్చారు. అప్పుడు టైం సుమారుగా సాయంత్రం గం॥ 5లేదా 5-30 ఐవుంటుంది. మల్లికా............ పెదనాన్నతో నేను మాట్లాడుతూ మా నాన్న దగ్గర డబ్బులు లేవంటా....! కారు బాడుగ డబ్బులు ఎవరినన్నా అడిగి ఇప్పించమన్నాను, అక్కడకు వెళ్లింతరువాత ఎవర్నన్నా అడిగి ఇప్పిస్తానన్నాడు (నాగయ్య దగ్గర కానీ శివయ్య దగ్గర కానీ). కొంత సేపటికి................. **"ఇప్పటి నుండి వుంటుంది అన్నాడు"**. అమాట ఎందుకన్నాడో తెలియదు......!!.

కారు కావలి దగ్గరకు రాగానే **'ఉరుములూ... మెఱుపులూ...'** ఎక్కువైయ్యాయి. కారు నెల్లూరు బార్డర్‌కి రాగానే ఒక పూలమాల, టెంకాయ మొదలైనవి తీసుకొన్నాము. డాడీ డ్రైవర్‌తో నేరుగా బోడిగాడు తోటకు (బరియల్ గ్రౌన్డ్) తీసుకొని వెళ్లమన్నాడు. అంతలో మల్లికా పెదనాన్న మాట్లాడుతూ **'ముందు ఇంటి దగ్గరకు తీసుకొని వెళ్లి, అక్కడ టెంకాయ కొట్టింతరువాత బోడిగాడుతోట (బరియల్ గ్రౌన్డ్) కు తీసుకొని వెళ్లాలన్నాడు'** దీని తరువాత నేరుగా ఇంటి దగ్గరకు వచ్చాము.

## :: ఏడవ భాగం ::

అప్పటికే చుట్టు పక్కల వారు చాలా మంది మా ఇంటి ముందు గుమిగూడి వున్నారు. మేము కార్లో ఇంటి దగ్గర దిగగానే ఇంటి ముందు టెంకాయ కొట్టి, కర్పూర హారతి ఇచ్చి తిరిగి బోడిగాడి తోటకు (బరియల్ గ్రౌన్డ్) నేనూ, శేఖర్ (మల్లికా పెదనాన్న కొడుకు), సుబ్రహ్మణ్యం (మా ఇంటి పక్కింటాయన), శంకరబాబు పెదనాన్న, డాడీ ఇంకా కొంత మంది వెళ్లాము. మమ్మీ మరియు మల్లికా పెద్దనాన్న ఇంటి దగ్గరే వుండిపోయారు. మల్లికా పెదనాన్న మాత్రం మన ఇంటి పక్కింటాయన్ని (శివయ్య) రెండు వేల రూపాయలు అడిగి మాకు (కారు బాడుగ) ఇప్పించాడు.

AANANDHA SAPTHAKAMU

ఇంటి దగ్గర పై కార్యక్రమాన్ని ముగించుకొని బరియల్ గ్రౌన్డ్‌కు వెళ్లేటప్పటికి ఉమా, సాయి బస్సు దిగి మాకు ఎదురు వచ్చారు. బ్రాహ్మణ వీధిలోని సురేంద్ర పెదనాన్న (ధనమ్మ భర్త) కూడా అక్కడకు వచ్చివున్నాడు. ఉమా ఫోన్ చేసి సుమన్‌న్ని (చెస్ ప్లేయర్ ఆనంద్ స్నేహితుడు) కూడా పిలిపించాడు. బోడిగాడి తోటలో ఆనంద్ బాడీని పూడ్చడానికి ఒక గొయ్యి తొవ్వి బాడీని పూడ్చే సమయంలో……అక్కడకి వచ్చిన వారిలో కొందరు చిన్న అలజడిని లేపారు, అదేంటంటే…..అక్కడి వారు గొయ్యను సరిగా తొవ్వలేదంట ఇంకొంత ఎక్కువ లోతు తొవ్వించమని సలహా ఇచ్చారు. వారు ఇచ్చిన సలహా మేరకు ఆనంద్ బాడీని ఆ గొయ్యిలో నుంచి పక్కకు తీసి తిరిగి ఆ గొయ్యను ఇంకొంత లోతుగా తొవ్వించాము సురేంద్ర పెదనాన్న మాట్లాడుతూ…….ఒక సారి గొయ్యిలో బాడీని వుంచిన తరువాత బాడీని తిరిగి తియ్యకూడదు, ఎందుకలా చేసారని అడిగాడు…..! మేము అతని మాటలను పట్టించుకోకుండా పూడ్చే కార్యక్రమం పూర్తి చేసాము.

తిరిగి ఇంటికి వచ్చే సమయానికి మరొక అలజడి మొదలైంది. అదేంటంటే మా డాడీ మరియు కారు డ్రైవర్ గొడవ పడ్డారంట. మేము ఇంటికి బయలుదేరే సమయానికి జోరుగా వర్షం పడుతూ వున్నది. ఆ వర్షం మన ఇంటికి బయలు దేరేముందు మొదలై………ఇంటికి రాగానే ఆగిపోయింది. నాకు ఆ కారు డ్రైవర్‌తో గొడవ పడింది తెలుసుకానీ, డబ్బుల గురించి గొడవ జరిగిందని మాత్రం తెలియదు. నేను ఇంటికి వచ్చింతరువాత మీ డాడీ కారు డ్రైవర్‌తో బేటా కోసం గొడవ పడుతుంటే మీ పెదనాన్న ఆ డ్రైవర్‌కి రూ॥ 300/- ఇచ్చాడంట అని ధనా పెద్దమ్మ చెప్తే నాకు తెలిసింది. ఆ గొడవ డబ్బుల గురించి అని తెలిసి వుంటే ఆ డబ్బులు నేను అక్కడే ఇచ్చి వుండేవాడ్ని.

బరియల్ గ్రౌన్డ్ నుండి ఇంటికి వచ్చింతరువాత స్నానం చేసి, ఆనంద్ చనిపోయిన విషయాన్ని తెలియపరచాలని ఆనంద్ పనిచేసే ఆఫీస్‌కి (ఘోరఖ్‌పూర్) ఫోన్ చేసాను. అక్కడి వారు నేను చెప్పే విషయం అర్థం చేసుకోకుండా…..ఆనంద్ సెలవలో వున్నాడని హిందీలో చెప్పి ఫోన్ పెట్టేశారు. మళ్లీ రెండవ సారి వారికి ఫోన్ చేసి నేను నెల్లూరు నుండి మాట్లాడుతున్నాను, నేను ఆనంద్ బ్రదర్‌ని అని చెప్పి…ఆనంద్ నిన్నటి రోజు చనిపోయా-డన్నాను. నేను చెప్పింతరువాత **'అక్కడి స్టాఫ్ అంతా చాలా అలర్ట్'** అయిపోయారు. నేను చెప్పిన విషయాన్నే పదే పదే అడుగుతూ…. ఎప్పుడు చనిపోయాడు, ఎలా చనిపోయాడు మొదలగు విషయాలన్నీ వారు హిందీలో అడిగి నోట్ చేసుకొన్నారు.

తరువాతి రోజు ఘోరఖ్‌పూర్ ఆఫీస్ నుండి మరియు ఘోరఖ్‌పూర్ లోని ఆనంద్ స్నేహితుల నుండి మా ఇంటికి చాలా కాల్స్ వచ్చాయి. పై కాల్స్‌లో అతి ముఖ్యమైనవి

AANANDHA SAPTHAKAMU

ఆనంద్ ఫ్రెండ్స్ నుండి వచ్చిన కాల్స్. వారు మమ్మల్ని అడిగిన విషయాలు ఏమిటంటే... **ఆనంద్ ఎప్పుడు చనిపోయాడు?, ఎలా చనిపోయాడు?, ఎందుకు చనిపోయాడు?** నేను వారికి వివరంగా పైన జరిగిన విషయాలనే చెప్పాను. మాకు ఆనంద్ ఎందుకు చనిపోయాడో..తెలియటం లేదు. ఇంటికి వచ్చినప్పుడు కొద్దిగ తలనొప్పిగా వుందన్నాడు. అంతే కానీ ఇక్కడ ఆనంద్ బాధపడే విషయాలేమీ జరగలేదని మమ్మీ, నేనూ చెప్పాము.

ఘోరఖ్‌పూర్‌లోని ఆనంద్ స్నేహితులు..........ఆనంద్‌కి సంబంధించిన అతి ముఖ్యమైన కొన్ని విషయాలు (మాకు తెలియనివి) చెప్పారు. అవేమిటంటే ఆనంద్ ఒక సంవత్సరం నుంచి **స్కిజోఫ్రీనియా** అనే మానసిక వ్యాధితో బాధ పడుతున్నాడంట. గత సంవత్సరం వారే (తన స్నేహితులు) ఆనంద్‌ని హాస్పిటల్‌కి తీసుకొని వెళ్లి ట్రీట్‌మెంట్ ఇప్పించారంట. ఇంకా ట్రీట్‌మెంట్‌లోనే వున్నాడట. ఇంతలోనే ఈ విధంగా జరిగి పోయిందన్నారు.

ఇప్పటి వరకు ఆ విషయం మాకెందుకు చెప్పలేదని మమ్మీ అడిగితే...ఆనందే ఎవ్వరికీ చెప్పవద్దన్నాడు. తనే మీకు చెప్తానన్నాడు, మీకు ఇప్పటి వరకూ ఆ విషయం తెలియదా.....!! అని ఆశ్చర్య పోయారు. ఆనంద్ అనారోగ్యం గురించి మీకు తెలిసి-వుంటుందను కొన్నాము **" సారీ అమ్మ.....!! "** అని ఫోన్ పెట్టేశారు.

AANANDHA SAPTHAKAMU

